బడినదియునైన వస్తికషాయమును ప్రయోగించిన ఆకషాయము దుర్బలముగ నుండుట వలన దోషములను స్వస్థానమునుండి చలింపఁజేసి రోగమును నివర్తింపఁజేయనేరదు. దీనినే వస్తికర్మ అయోగమనియెదరు. ఇది అపానవాత మలమూత్ర ప్రతిబంధములు నాభి పొత్తికడుపు వీనియందుశూల, సర్వాంగతాపము, బొమ్మర్నొప్పి, గుదమునందు వాపు, దురద, పిటికలు, శరీరమునందు వికారవర్ణము, ఉత్సాహములేకుండుట, జాఠరాగ్ని మాంద్యము మొదలగు రోగములను జనింపజేయును.

వస్తికర్మాయోగచికిత్స.

శ్లో॥ క్వాథద్వయం ప్రాగ్విహితం మధ్యదోషేఽతిసారిణి।
ఉష్ణస్య తస్మాద్ధ్యేకస్య తత్ర పానం ప్రశస్యతే॥ 4.
ఫలవర్త్య స్తథా స్వేదాః కాలం జ్ఞాత్వా విరేచనమ్।
బిల్వమూలత్రివృద్దారుయవకోలకులుత్థవాః॥ 5.
సురాదిమాం స్తత్ర వస్తి స్స ప్రాక్షేప్య స్త మానయేత్।

తా॥ పైనచెప్పిన వస్తికర్మాయోగమునకు అతిసార చికిత్సాప్రకరణమున మధ్యదోషముగల అతిసారరోగమునకు చెప్పియుండు భూతీకపిప్పల్యాది కషాయము, బిల్వధనికాది కషాయము అనునీ రెంటిలో నేదైన నొక కషాయమును ఉష్ణముగ పానము చేయించవలయును. మఱియు ఫలవర్తులు నానావిధస్వేదకర్మలు అవస్థానుగుణముగ విరేచనము వీనిని చేయించవలయును. మారేడువేళ్లు - తెగడ - దేవదారు - యవలు - రేఁగు - ఉలవలు వీనితోఁగూడినవస్తి, సురయనుమద్యముతోఁగూడినవస్తి, వీనిలో పూర్వాధ్యాయములో « బలాం గుడూచీ '' త్యాది శ్లోకములలో సర్వరోగహరవస్తి కల్పమునకువచించియుండు యవాన్యాదికల్కమును కలిపి ప్రయోగించవలయును. ఇటులచేసిన వస్త్యయోగముచే స్వస్థానమునందుండి చలించియుండు దోషము బైలువెడలును.

దోషాధిక్యాదులయందు అల్పవీర్యవస్తిజనితోపద్రవము.

శ్లో॥ యుక్తోఽల్పవీర్యో దోషాఢ్యే రూక్షే క్రూరాశయేఽథవా॥ 6.
వస్తిర్దోషావృతో రుద్ధమార్గో రుంధ్యా త్సమీరణమ్।
స విమార్గోఽనిలః కుర్యా దాధ్మానం మర్మపీడనమ్॥ 7.
విదాహం గుదకోష్ఠస్య ముష్కవంక్షణవేదనామ్।
రుణద్ధి హృదయం శూలై రితశ్చేత శ్చ ధావతి॥ 8.

తా॥ దోషాధిక్యముగలవారికిని లేక కఠినకోష్ఠముగలవారికిని అల్పవీర్యముగల వస్తిని ప్రయోగించిన నది వాతాదిదోషములచే నావరింపఁబడి స్తబ్ధమై వాతమును అడ్డగించును. అటుల తనమార్గముడ్డగింపఁబడియుండుటవలన ఆవాతము విరుద్ధమార్గముగ సంచరించుచు కడుపుబ్బరము, మర్మస్థానములయందుపీడ, గుద కోష్ఠములయందుమంట, వృషణములయందును గజ్జలయందును శూల, అామ్మడచుట వీనినికలుగఁజేయుచు శరీరమునం దచటచట సంచరింపుచుండును.

అల్పవీర్యవస్తిప్రయోగజనితరోగమునకు నిరూహవస్తి.

శ్లో॥ స్వభ్యక్తస్విన్నగాత్రస్య తత్ర వర్తిం ప్రయోజయేత్ ।
బిల్వాదిశ్చ నిరూహస్స్యాత్ పీలుసర్షపమూత్రవాన్ ॥ 9.
సరళామరదారుభ్యాం సాధితం వానువాసనమ్ ।

తా॥ పైజెప్పిన యవస్థావిశేషమునందు రోగిశరీరమునకు అభ్యంగస్వేదకర్మలను చేయించి ఫలవర్తిని ప్రయోగించవలయును. బిల్వాదులతో పక్వముచేయఁబడిన నిరూహవస్త్యౌషధములలో గోఁగు-ఆవాలు - గోమూత్రము వీనిని కలిపి నిరూహవస్తిని ప్రయోగించవలయును. సరళదారు - దేవదారు వీనితోపక్వముచేయఁబడిన తైలముచే అనువాసనవస్తిని చేయించవలయును.

న్యూనాధికవస్తిప్రయోగజనితోపద్రవములు.

శ్లో॥ కుర్వతో వేగసంరోధం పీడితో వాఽతిమాత్రయా ॥ 10.
అస్నిగ్ధలవణోష్ణో వా వస్తి రల్పోఽల్పభేషజః ।
మృదు ర్వా మారుతే నోర్ధ్వం విక్షిప్తో ముఖనాసికాత్ ॥ 11.
నిరేతి మూర్ఛాహృల్లాసతృడ్దాహాదీన్ ప్రవర్తయన్ ।

తా॥ మలమూత్రాది వేగముల నడ్డగించువానికి వస్తికర్మను ప్రయోగించినను, లేక వస్తికర్మను అధికముగ చేయించినను, స్నేహము లవణముచేర్చక ఉష్ణముగవస్తికర్మను ప్రయోగించినను, లేక స్వల్పప్రమాణముగ లేక అల్పవీర్యముగల యౌషధములు గలదిగనుండు వస్తికర్మను ప్రయోగించినను, లేక మృదువైన వస్తికర్మను ప్రయోగించినను ఆవస్త్యౌషధములు వాతముచే ఊర్ధ్వభాగమునకు త్రోయఁబడినవై మూర్ఛ, హృల్లాసము, దప్పి, సర్వాంగతాపము మొదలగు నుపద్రవములను గలుగఁ జేయుటయేగాక నోరు ముక్కు వీనినుండి వెలువెడలును.

## న్యూనాధికవస్త్యాదిజనితోపద్రవచికిత్స.

శ్లో॥ మూర్ఛావికారం దృష్ట్వాఽస్య సించేచ్ఛీతాంబునా ముఖమ్ ॥
వ్యజేదాక్లమనాశాచ్చ ప్రాణాయామం చ కారయేత్ ।
పృష్ఠపార్శ్వోదరం మృద్యాత్కరైరుష్ణైరధోముఖమ్ ॥ 13.
కేశేషూత్క్షిప్య ధున్వీత భీషయేద్వ్యాళదంష్ట్రిభిః ।
శస్త్రోల్కారాజపురుషైర్వస్తిరేతి తథా హ్యధః ॥ 14.
పాణివస్త్రైర్గళాపీడం కుర్యాన్న మ్రియతే యథా ।
ప్రాణోదాననిరోధాద్ధి సుప్రసిద్ధతరాయనః ॥ 15.
అపానః పవనో వస్తిం తమాశ్వేవాపకర్షతి ।
కుష్ఠక్రముకకల్కం వా పాయయేతామ్లసంయుతమ్ ॥ 16.
ఔష్ణ్యాత్తైక్ష్ణ్యాత్సరత్వాచ్చ వస్తిం సోఽస్యానులోమయేత్ ।
గోమూత్రేణ త్రివృత్పథ్యాకల్కంచాధోఽనులోమనమ్ ॥ 17.
పక్వాశయస్థితే స్విన్నే నిరూహో దశమూలికః ।
యవకోలకుళుత్థైశ్చ విధేయో మూత్రసాధితైః ॥ 18.
వస్తిర్గోమూత్రసిద్ధైర్వా సామృతావంశపల్లవైః ।
పూతీకరంజత్వక్పత్రశఠీదేవాహ్వరోహిషైః ॥ 19.
సతైలగుడసింధూత్థవిరేకౌషధకల్కవాన్ ।
బిల్వాదిపంచమూలేన సిద్ధో వస్తిరురస్థితే ॥ 20.
శిరస్థే నావనం ధూమః ప్రచ్ఛర్ద్యం సర్షపైశ్శిరః ।

తా॥ రోగికి వస్తికర్మవిధిప్రకారము ప్రయోగించకుండుటవలన జనించు మూర్ఛావికారములను చక్కఁగ తెలిసికొని వానియొక్క ముఖమునందు శీతోదకమును చల్లవలయును. బడలికశమించువరకు విసనకఱ్ఱ మొదలగువానిచే విసరవలయును. వానిని ప్రాణాయామ (శ్వాసబంధ) మొనర్చునటుల చేయవలయును. నిప్పులో చేతులను కాఁచి వేడిగనున్నయా చేతులతో నడుము ప్రక్కలు కడుపు వీనియందు మెల్లగ బిసుకవలయును. మఱియు వానిని బోరగిలఁబరుండఁజేసి వాని వెండ్రుకలఁబట్టుకొని పైకెత్తి కదిలించవలయును. పాము - దంతములుఁగల దుష్టజంతువులు - ఆయుధము-

కొరవి - రాజభటులు మొదలగువానిచే భయపరచవలయును. ఇటులజేసిన పైభాగము నందుఁజేరియుండు నిరూహవస్తి క్రిందికి దిగును. మఱియు వానికి ప్రాణమున కపాయము గలుగనీయక చేతితో కంఠమును పట్టవలయును. లేకవస్త్రముచే కంఠమునుకట్ట వలయు. ఇటులజేసిన ప్రాణోదానవాతములమార్గము లడ్డగింపఁబడును. అంగువలన అపానవాతము స్పష్టమైన తనమార్గమునందు సంచరించుచు పైభాగమునుజెందియుండు నావస్తినిక్రిందిభాగమునకు శీఘ్రముగనీడ్చికొనును. చెంగల్వకోష్టు పోఁకలు వీనిని చక్కఁగనూరి కల్కముచేసి కలిలో కలిపి పానముచేయించవలయును. ఇటులజేసిన యాకల్కము ఉష్ణముగను, తీక్ష్ణముగను, శీఘ్రముగ వ్యాపించుస్వభావముగలదిగను నుండుటవలన నావస్తిని క్రిందిభాగమునకుదెచ్చును. తెగడ-కరక్కాయ వీనినినూరి గోమూత్రములోకలిపి పానముచేయించిన నావస్తి క్రిందికిదిగును ఆవస్తి పక్వాశయ నందుండిన స్వేదకర్మనుచేయించి దశమూలములతోపక్వముచేయఁబడిన నిరూహవస్తి చేతగాని గోమూత్రములో యవలు - రేఁగుపండు - ఉలవలు వీనిని పక్వముచేసి దాని చేతగాని లేక గోమూత్రములో తిప్పతీఁగె - వెదురుచిగుళ్లు - కలుక్రానుగు- లవంగపు చెక్క - ఆకుపత్రి - కచోరములు - దేవదారు - కామంచిగడ్డి వీనిని చేర్చి పక్వముచేసి అందులో నువ్వులనూనె - బెల్లము, సైంధవలవణము విరేచనౌషధకల్కము వీనినికలిపి దానిచేఁగాని నిరూహవస్తిని ప్రయోగించవలయును. ఆవస్తి ఆమాశయమందుండినచో బిల్వాదిపంచమూలములతో పక్వముచేయఁబడిన వస్తినిప్రయోగించవలయును. శిరమును జేరియుండినచో నస్యము, ధూమము, శిరమునకు ఆవాలపట్టు వీనిని చేయించవలయును.

వస్తికర్మాతియోగచికిత్స.

శ్లో॥ వస్తి రత్యుష్ణతీక్ష్ణామ్లఘనోఽతిస్వేదితస్య వా ॥ 21.
అల్పే దోషే మృదౌ కోష్ఠే ప్రయుక్తో వా పునఃపునః ।
అతియోగత్వమాపన్నో భవే త్కుక్షిరుజాకరః ॥ 22.
విరేచనాతియోగేన స తుల్యాకృతిసాధనః ।

తా॥ మిగుల నుష్ణముగను తీక్ష్ణముగను పుల్లగను గట్టిగనుండు ఔషధములచే చేయఁబడినవస్తి; స్వేదకర్మను అధికముగ చేయించుకొనిన వానికిప్రయోగించినవస్తి లేక దోషము స్వల్పముగనుండు వానికిఁగాని మృదుకోష్ఠము గలవానికిఁగాని ప్రయోగించినవస్తి; పలుమారుప్రయోగించినవస్తి; యివి అతియోగమునుజెంది కడుపు నొప్పిని కలుగఁజేయును. మఱియు దీనియందు విరేచనాతియోగమునకుచెప్పియుండు లక్షణములన్నియు కలుగును. కావున విరేచనాతియోగమునకు చెప్పియుండు చికిత్స లనే చేయవలయును.

క్షారామ్లాదివస్తిజనితోపద్రవచికిత్స.

శ్లో॥ వస్తిః క్షారామ్లతీక్ష్ణోష్ణలవణః పైత్తికస్య వా ॥ 23.
గుదం దహన్ లిఖన్ క్షిణ్వన్ కరోత్యస్య పరిస్రవమ్ ।
సవిదగ్ధం స్రవత్యస్రం వర్ణైః పిత్తం చ భూరిభిః ॥ 24.
బహుశశ్చాతివేగేన మోహం గచ్ఛతి సోఽసకృత్ ।
రక్తపిత్తాతిసారఘ్నీ క్రియా తత్ర ప్రశస్యతే ॥ 25.
దాహాదిషు త్రివృత్కల్కం మృద్వీకావారిణా పిబేత్ ।
తద్ధి పిత్తశకృద్వాతాన్ హృత్వా దాహాదికాన్ జయేత్ ॥ 26.
విశుద్ధశ్చ పిబేచ్ఛీతాం యవాగూం శర్కరాయుతామ్ ।
యుంజ్యాద్వాతివిరిక్తస్య క్షీణవిట్కస్య భోజనమ్ ॥ 27.
మాషయూషేణ కుల్మాషాన్ పానం దధ్యథవా సురామ్ ।

తా॥ పిత్తప్రకృతి గలవానికి ప్రయోగించిన వస్తి; కారముగను పుల్లగను తీక్ష్ణముగను ఉష్ణముగను లవణముగను నుండు వస్తి, యివి గుదమునుకాల్చి దురదయుపద్రవము వీనినిగలుగఁజేయుచు స్రావమునుగలుగఁజేయును. మఱియు నట్టివానికి దాహజీర్ణముతోడ రక్తముస్రవించును. అనేకవర్ణములతో పలుమారు పిత్తము అతి వేగముతో వెడలుచుండును. పలుమారు మూర్ఛకలుగును. అట్టియవస్థయందు రక్తపిత్తము, రక్తాతిసారము వీనికిచెప్పియుండు చికిత్సలనుజేసిన హితముకలుగును. సర్వాంగతాపము- గుదమునందు మంట మొదలగు నుపద్రవములుకలిగియుండినచో తెగడకల్కమును ద్రాక్షపండురసములోకలిపి పానము చేయించవలయును. ఇది పిత్తము మలము వాతము వీనినిశమింపఁజేసి మంట మొదలగు నుపద్రవములను పోకడచును. పిదప శుద్ధిజెందినకోష్ఠముగలవానికి గంజిని పంచదారతోడ శీతముగపానము చేయించవలయును. అధికవిరేచనమగుటచే మలముక్షయించియుండిన అట్టివానికి కాలుమినుముల గుగ్గిళ్లనుగాని మినుపకట్టుతో అన్నమునుగానిభుజింపఁజేయవలయును. పెరుఁగునైనను సురయనుమద్యమునైనను పానముచేయించవలయును.

శ్లో॥ సిద్ధిర్వస్త్యాపదామేవం స్నేహవస్తేస్తు వక్ష్యతే ॥ 28.

తా॥ ఇటుల నిరూహవస్తివ్యాపత్తులకు చికిత్సలు చెప్పఁబడినవి, యింక అనువాసనవస్తుల వ్యాపత్తులకు చికిత్సలు చెప్పఁబడుచున్నవి.

## అనువాసనవస్తివ్యాపచ్చికిత్స.

శ్లో॥ శీతోఽల్పేవాఽధికే వాతే పిత్తేఽత్యుష్ణః కఫే మృదుః।
అతిభుక్తే గురు ర్వర్చస్సంచయేఽల్పబలే తథా॥ 29.
దత్త స్తై రావృతస్స్నేహో నాయా త్యభిభవా దపి।
స్తంభోరుసదనాధ్మానజ్వరశూలాంగమర్దనైః॥ 30.
పార్శ్వరుగ్వేష్టనై ర్విద్యా ద్వాయునా స్నేహ మావృతమ్।
స్నిగ్ధామ్లలవణోష్ణై స్తం రాస్నాపీతద్రుతైలికైః॥ 31.
సౌవీర కసురాకోలకులుత్థయవసాధితైః।
నిరూహై ర్నిర్హరే త్సమ్య క్సమూత్రైః పంచమూలకైః॥ 32.
తాభ్యా మేవ చ తైలాభ్యాం సాయం భుక్తేఽనువాసయేత్॥

తా॥ వాతము స్వల్పముగగాని అధికముగగానియుండఁగా శీతముగ ప్రయోగించినవస్తి; పిత్తమునందు ప్రయోగించిన అత్యుష్ణమైనవస్తి; కఫమునందు ప్రయోగించిన మృదువైనవస్తి; అధికముగభుజించియుండునపుడు ప్రయోగించిన గురువైనవస్తి; మలమువృద్ధిజెందియుండునపుడు ప్రయోగించినవస్తి; దుర్బలముగలిగియుండువానికిఁ జేయించినవస్తి; యీవస్తులు అయోగమునుజెంది శీతాదికారణములవలన వాతాదిదోషములచేనావరింపఁబడి గుదమార్గముగ బైలువెడలకుండును. దానివలన స్తబ్ధత్వము, తొడలయందు దౌర్బల్యము, కడుపుబ్బరము, జ్వరము, శూల, శరీరమంతట నొప్పి, పార్శ్వశూల యీయుపద్రవములుజనించును. అట్లుజనించిన అనువాసనవస్తి వాతముచేనావరింపఁబడినదని తెలిసికొని స్నిగ్ధముగను పుల్లగను ఉప్పగను ఉష్ణముగనుండు నిరూహవస్తిని ప్రయోగముచేసి పైఅనువాసనవస్తిని వెలిపరచవలయును. దుంపరాస్నతైలము-మ్రానిపసుపుతైలము - వీనితోఁగూడినదిగను, కలి - సురయనుమద్యము-రేఁగు- ఉలవలు-యవలు వీనితో పక్వముచేయఁబడినదిగను, గోమూత్రము పంచమూలకషాయము అనువానితోఁగూడినవిగనునుండు నిరూహవస్తికర్మలచే పైస్నేహవస్తిని చక్కఁగ వెలిపరచుటయేగాక దుంపరాస్నతైలముచేఁగాని పసుపుతైలముచేఁగాని దోషాద్యనుగుణముగ సాయంకాల భోజనానంతరము అనువాసనవస్తిని ప్రయోగించవలయును.

## పిత్తావృతస్నేహవస్తివ్యాపచ్చికిత్స.

శ్లో॥ తృడ్దాహరాగసమ్మోహవైవర్ణ్యతమకజ్వరైః॥ 33.
విద్యా త్పిత్తావృతం స్వాదుతిక్తై స్తం వస్తిభి ర్హరేత్।

తా॥ దప్పి, సర్వాంగతాపము, అపథ్యవస్తువులయందిచ్ఛ, మోహము, వికారవర్ణము, తమకశ్వాసము, జ్వరము అనునీరోగములు కలిగియుండినయెడల స్నేహవస్తి పిత్తముచే నావరింపఁబడియున్నదని తెలిసికొని మధురముగ చేఁదుగనుండు ద్రవ్యములనుచేర్చి పక్వముచేయఁబడిన వస్తికషాయముచే పైస్నేహవస్త్యౌషధమును బైలువెడలింపవలయును.

## శ్లేష్మావృతస్నేహవస్తిచికిత్స.

శ్లో॥ తంద్రాశీతజ్వరాలస్యప్రసేకారుచిగౌరవైః॥ 34.
సమ్మూర్ఛాగ్లానిభి ర్విద్యా చ్ఛ్లేష్మణా స్నేహ మావృతమ్।
కషాయతిక్తకటుకై స్సురామూత్రోపసాధితైః॥ 35.
ఫలతైలయుతై స్సామ్లై ర్వస్తిభి స్తం వినిర్హరేత్।

తా॥ తంద్ర, శీతజ్వరము, ఉత్సాహములేకుండుట, నోటియందు నీరూరుట, అరుచి, గురుత్వము, మూర్ఛ, బడలిక యివిగలిగియుండినచో స్నేహవస్తి కఫముచే నావరింపఁబడియున్నదని తెలిసికొని వగరు కారము చేఁదు ఈరసములుఁకలవియును సురయనుమద్యము గోమూత్రము వీనితో పక్వముచేయఁబడినవియును ఉష్ణవీర్యముగల అక్షోటము మొదలగు ఫలములయొక్క తైలముతోఁగూడినవియునునైన వస్తికర్మలప్రయోగముచేసి స్నేహవస్తిని బయలువెడలింపఁజేయవలయును. " ఫలతైలయుతైః " అను మూలశ్లోకవాక్యమునకు మ్రంగవండు - నువ్వులనూనెవీనిని వస్తికషాయములో చేర్చవలయునని కొందఱు వ్యాఖ్యానము చేయుచున్నారు.

## అన్నావృతస్నేహవస్తిచికిత్స.

శ్లో॥ ఛర్దిమూర్ఛారుచిగ్లానిశూలనిద్రాంగమర్దనైః। 36.
ఆమలింగై స్సదాహై స్తం విద్యా దత్యశనావృతమ్।
కటూనాం లవణానాం చ క్వాథై శ్చూర్ణై శ్చ పాచనమ్ ॥37.
మృదు ర్విరేక స్సర్వం చ తత్రామవిహితం హితమ్।

తా॥ వాంతి, మూర్ఛ, అరుచి, బడలిక, శూల, నిదుర, శరీరమంతటనొప్పి, సర్వాంగతాపము మొదలగు వజీర్ణలక్షణంబులుఁ కలిగియుండినయెడల స్నేహవస్త్యౌషధము అధికాహారముచే నావరింపఁబడియున్నదని తెలిసికొని కారముగ, ఉప్పగనుండు ద్రవ్యములకషాయములచేతను చూర్ణములచేతను స్నేహము జీర్ణమగునటులచేసి మృదువైనవిరేచనమును, అజీర్ణమునకుచెప్పియుండు చికిత్సలను చేయించవలయును.

### మలావృతస్నేహవస్తిచికిత్స.

శ్లో॥ విణ్మూత్రానిలసంగార్తిగురుత్వాధ్మానహృద్గ్రహైః ॥ 38.
స్నేహం విడావృతం జ్ఞాత్వా స్నేహస్వేదై స్సవర్తిభిః ।
శ్యామాబిల్వాదిసిద్ధైశ్చ నిరూహై స్సానువాసనైః ॥ 39.
నిర్హారే ద్విధినా సమ్య గుదావర్తహరేణ చ ।

తా॥ మలమూత్ర అపానవాతప్రతిబంధములు, శూల, గురుత్వము, కడుపుబ్బరము, ఱొమ్ముపట్టు అనునీయుపద్రవములు గలిగియుండినచో స్నేహవస్తి మలముచే నావరింపఁబడినదని తెలిసికొని స్నేహస్వేదకర్మలు, వర్తులు, తెగడ, బిల్వాదిగణద్రవ్యములు వీనితోఁబక్వముచేయఁబడిన నిరూహవస్త్యౌషధము అనువాసనవస్త్యౌషధము, ఉదావర్తమును పోఁగొట్టునట్టిచికిత్సలు వీనిని ప్రయోగించి స్నేహవస్తిని వెలుపరచవలయును.

### అభుక్తాదులకు స్నేహవస్తిజనితోపద్రవచికిత్స.

శ్లో॥ అభుక్తేశూనపాయౌ వా పేయా మాత్రాశితస్య చ ॥ 40.
గుదే ప్రణిహితస్నేహో వేగా ద్ధావ త్యనావృతః ।
ఊర్ధ్వం కాయం తతః కంఠా దూర్ధ్వేభ్యః ఖేభ్యఏత్యపి ॥ 41.
మూత్రశ్యామాత్రివృత్సిద్ధో యవకోలకుళుత్థవాన్ ।
తత్సిద్ధతైలో దేయ స్స్యా న్నిరూహ స్సానువాసనః ॥ 42.
కంఠా దాగచ్ఛత స్తంభకంఠగ్రహావిరేచనైః ।
ఛర్దిఘ్నీభిః క్రియాభి శ్చ తస్య కుర్యా న్నిబర్హణమ్ ॥ 43.

తా॥ ఆహారమునుభుజింపకయుండువానికిస్నేహవస్తినిప్రయోగించినను గుదము ఉబ్బియుండువానికి స్నేహవస్తినిప్రయోగించినను పేయమను గంజినిమాత్రము భుజించినవానికి గుదమున స్నేహవస్తిని ప్రయోగించినను అది అతివేగముతో అడ్డము (లేక) శరీరమంతటవ్యాపించి ఊర్ధ్వశరీరమును జెంది కంఠమునకు పైభాగమునందుండు నాసికాదిద్వారములవలన వెలువెడలును. దీనియందు గోమూత్రము - నల్లతెగడ - తెల్లతెగడ - యవలు - రేఁగు - ఉలవలు - వీనికషాయములతో పక్వముచేయఁబడిన తైలముచే నిరూహానువాసన వస్తికర్మలను చేయించవలయును. మఱియు పైస్నేహవ కంఠమార్గముగ వెలువెడలిన కంఠగ్రహము, వాంతినిపోఁగొట్టునట్టిచికిత్సలు, విరేచనవ [illegible] శేగకుండునటుల జేయవలయును.

వస్తికర్మయందపక్వ స్నేహనిషేధము.

శ్లో॥ నాపక్వం ప్రణయే త్స్నేహం గుదం సహ్యుపలింపతి ।
తతః కుర్యా త్సతృణోన్మోహకండూశోఫాన్ క్రియా త్రవా ॥
తీక్ష్ణో వస్తి స్తథా తైల మర్కపత్రరసే శృతమ్ ।

తా॥ చక్కఁగ పాకమును జెందకుండునట్టి స్నేహమును వస్తికర్మయందు ప్రయోగించంజనదు. అటుల ప్రయోగించినవది గుదమునందంటుకొని దప్పి, మోహము దురద, వాపు మొదలగునుపద్రవములను కలుగజేయును. దీనియందు తీక్ష్ణమైన వస్తికర్మలను ప్రయోగించవలయును. జిల్లేడాకులతో కాఁచఁబడినతైలమును గుదమునకు పూయవలయును.

నిశ్శేషవస్తిప్రయోగజనితోపద్రవచికిత్స.

శ్లో॥ అనుచ్ఛ్వాస్య తు బద్ధే వా దత్తే నిశ్శేషఏవ వా ॥ 45.
ప్రవిశ్య క్షుభితో వాయు శ్శూలతోదకరో భవేత్ ।
తత్రాభ్యంగో గుదే స్వేదో వాతఘ్నా న్యశనాని చ ॥ 46.

తా॥ వస్తియంత్రముయొక్క ద్వారము మూయఁబడియుండునపుడు వస్తికర్మను ప్రయోగించినను లేక వస్తియంత్రమునందలి కషాయాదులను నిశ్శేషముగ ప్రయోగించినను లోన వాతముప్రకోపించి శూలలను పోట్లను కలుగఁజేయును. దీనియందు గుదమున కభ్యంగస్వేదకర్మలను చేయించుటయేగాక వాతహరమైన అన్నపానాదుల నిప్పించవలయును.

వేగముగవస్తికర్మనుప్రయోగించుటవలన జనించునుపద్రవచికిత్స.

శ్లో॥ ద్రుతంప్రణీతే నిష్కృష్టే సహసోత్క్షిప్తఏవవా ।
స్యాత్కటీగుదజంఘోరువస్తిస్తంభార్తిభేదనమ్ ॥ 47.
భోజనం తత్ర వాతఘ్నం స్వేదాభ్యంగా స్సవస్తయః ।

తా॥ వస్తినిశీఘ్రముగ నీడ్చినను- పైకెత్తినను- నడుము, గుదము, పిక్కలు, తొడలు, పొత్తికడుపు వీనియందు స్తంభత్వము-శూల-చీల్చునటుల యుపద్రవము ఇవి జనించును. దీనికి వాతహరమైన భోజనము, స్వేదము, అభ్యంగము వస్తికర్మలు ఈ చికిత్సలను చేయవలయును.

వస్తియంత్రమునుచక్కఁగ ప్రయోగింపకుండుటచే
జనించునుపద్రవచికిత్స.

శ్లో॥ పీడ్యమానేఽంతరా ముక్తే గుదే ప్రతిహతోఽనిలః ॥ 48.
ఉరశ్శిరోరుజం సాద మూర్వో శ్చ జనయే ద్బలీ।
వస్తిస్స్యా త్తత్ర బిల్వాదిఫలై శ్శ్యామాదిమూత్రవాన్ ॥

తా॥ వస్తియంత్రమును గుదమునందునిచి ప్రయోగించునపుడు మధ్యకాలమున యంత్రమును వదలిపెట్టిన వాతము గుదములో దుష్టంబై ఱొమ్మునొప్పి తలనొప్పి తొడలయందు దౌర్బల్యము వీనినికలుగజేసును. దీనియందు బిల్వాదిగణద్రవ్యములు - మ్రంగవండు - తెగడ - గోమూత్రము వీనితో పక్వము చేయఁబడినకషాయముచే వస్తిని ప్రయోగించవలయును.

వస్తినిమిక్కుటముగ ప్రయోగించుటచేజనించునుపద్రవచికిత్స.

శ్లో॥ అతిప్రపీడితః కోష్ఠే తిష్ఠ త్యాయాతి వా గళమ్।
తత్ర వస్తి ర్విరేక శ్చ గళపీడాదికర్మ చ ॥ 50.

తా॥ వస్తియంత్రమును అధికముగనీడ్చి ప్రయోగించిన ఆవస్త్యౌషధము కోష్ఠమునుగాని కంఠమునుగాని చేరును. దీనియందు వస్తికర్మ విరేచనము కంఠపీడనము మొదలగు చికిత్సలను చేయవలయును.

వమనాదికర్మవిశుద్ధరక్షణావశ్యకత్వము.

శ్లో॥ వమనాద్యై ర్విశుద్ధం చ క్షామదేహబలానలమ్।
యథాండం తరుణం పూర్ణం తైలపాత్రం యథా తథా ॥ 51.
భిష క్ప్రయత్నతో రక్షే త్సర్వస్మా దపవాదతః।

తా॥ "అపుడుజనించిన గ్రుడ్డును మిగులజాగరూకతతో రక్షించునటులను, నూనెచే పూర్ణంబైయుండు పాత్రమును కడుప్రయత్నముతో రక్షించునటులను" వమనవిరేచనాది క్రియలచే శుద్ధిజెందిన శరీరముగలవాఁడును, కృశించిన శరీరముగలవాఁడును, శరీరబలము జాఠరాగ్నిబలము ఇవి తగ్గియుండు వాఁడు నగుపురుషుని మిక్కిలి ప్రయత్నముతో రక్షించవలయును.

వమనాదికర్మలచే శుద్ధశరీరికి రసోపయోగక్రమము.

శ్లో॥ దద్యా న్మధురహృద్యాని తతోఽమ్లలవణౌ రసౌ ॥ 52.

స్వాదుతిక్తౌ తతో భూయః కషాయకటుకౌ తతః ।
అన్యోన్యప్రత్యనీకానాం రసానాం స్నిగ్ధరూక్షయోః ॥ 53.
వ్యత్యాసా దుపయోగేన క్రమాత్తం ప్రకృతిం నయేత్ ।

తా॥ వమనాదికర్మలచే శుద్ధశరీరుఁడును దుర్బలుఁడునునైనవానికి తొలుత మధురముగను చేఁదుగను, మనసునకింపుగనునుండురసములనిప్పించవలయును. తర్వాత కషాయకటురసములను, పిదప మధురతిక్తరసములను. పదంపడి అమ్లలవణ రసములను ఇప్పించవలయును. ఇటుల పరస్పరవిరుద్ధములుగనుండు రసములను మార్చిమార్చి పలుమారు ప్రయోగించుటవలనను, పరస్పరవిరుద్ధముగనుండు స్నిగ్ధరూక్షయోగములను మార్చిప్రయోగించుటవలనను రోగికి మునుపటివలె శరీరస్వాస్థ్యమును గలుగ జేయవలయును.

శ్లో॥ సర్వంసహాస్థిరబలః విజ్ఞేయః ప్రకృతిం గతః ॥ 54.

తా॥ పథ్యాపథ్యవస్తువులనుభక్షించి వానిని జీర్ణముచేసికొనుటకు శక్తి, తగిన జాఠరాగ్నిబలమునుకలవాఁడును దృఢమైన శరీరబలముగలవాఁడు నగుపురుషుఁడు తనస్వభావరీతిని జెందినవాఁడని తెలిసికొనవలయును.

పంచమాధ్యాయము ముగిసెను.



శ్రీ ర స్తు.

# అష్టాంగహృదయము.



## షష్ఠాధ్యాయము.

" పూర్వాధ్యాయములయందు ప్రశస్తౌషధములను అక్ష ప్రమాణముగను, కర్ష ప్రమాణముగను, ఇప్పించవలయుననిచెప్పఁబడియున్నది. ప్రశస్తౌషధస్వరూపమును, కర్షాది ప్రమాణస్వరూపంబును తెలియనియెడల ఔషధమును ప్రయోగించుటకు శక్యముకానేరదు. కాఁబట్టి ప్రశస్తౌషధములు కర్షాది ప్రమాణములు వీనిలక్షణములను తెలియపరచుటకై భేషజకల్పాధ్యాయము చెప్పఁబడుచున్నయది. "

### భేషజకల్పాధ్యాయప్రారంభము.

సూ॥ అథాతో భేషజకల్పం వ్యాఖ్యాస్యామః ।
ఇతిహస్మాహు రాత్రేయాదయో మహర్షయః ॥

తా॥ వస్తివ్యాపత్సిద్ధ్యధ్యాయనిరూపణానంతరము ఔషధముల కల్పములను తెలియపరచునట్టి భేషజకల్పమనునీయధ్యాయమును వివరించెదము.

### ప్రశస్తౌషధీస్వరూపము.

శ్లో॥ ధన్వసాధారణే దేశే సమే సన్మృత్తికే శుచౌ ।
శ్మశానచైత్యాయతనశ్వభ్రవల్మీకవర్జితే ॥ 1.
మృదౌ ప్రదక్షిణజలే కుశరోహిషసంస్తృతే ।
అఫాలకృష్టేఽనాక్రాంతే పాదపై ర్బలవత్తరైః ॥ 2.
శస్యతే భేషజం జాతం యుక్తం వర్ణరసాదిభిః ।
జంత్వజగ్ధం దవాదగ్ధ మవిదగ్ధం చ వైకృతైః ॥ 3.

భూతై ర్వ్యాప్తా యాతివాంబ్వాద్యైర్య థాకాలం చ సేవితమ్ ।
అవగాఢమహామూల ముదీచీం దిశ మాశ్రితమ్ ॥ 4.

తా॥ మిట్టపల్లములు లేకుండునదియు, సమముగనుండునదియు, ప్రశస్తమైన మట్టితోఁగూడినదియు, పరిశుద్ధమైనదియు, శ్మశానము చైత్యము దేవాలయము పల్లము పుట్ట యివిలేనిదియు, మృదుస్పర్శముగలదియు, మంచి యుదకముతోఁగూడినదియు, కుశగడ్డి కామంచిగడ్డి యివిగలదియు, దున్నకుండునదియు గొప్పవృక్షములచేఁగప్పఁబడకుండునదియునైన జాంగలదేశ సాధారణదేశమునందు జనించినదిగను, మంచివర్ణరసములతోఁగూడినదిగను, *జంతువులచేభక్షింపఁబడనిదిగను, కార్చిచ్చుచేకాల్చఁబడనిదిగను, వికృతభూతంబులచే చెరచఁబడనిదిగను, యుక్తకాలంబులో నీడ యెండ ఉదకము మొదలగునవి కలిగియుండునదిగను, భూమికిలోపలదిగియుండు గొప్పవేరుతోఁగూడినదిగను, ఉత్తరదేశమునందుండునదిగనునుండు ఓషధి శ్రేష్ఠంబు.

ఓషధీగ్రహణక్రమము.

శ్లో॥ అథ కల్యాణచరిత శ్శ్రాద్ధ శ్శుచి రుపోషితః ।
గృహ్ణీయా దౌషధం సుస్థం స్థితం కాలే చ కల్పయేత్ ॥ 5.
సక్షీరం తదసంపత్తౌ వనతిక్రాంతవత్సరమ్ ।
ఋతే గుడఘృతక్షౌద్రధాన్యకృష్ణావిడంగతః ॥ 6.

తా॥ స్వస్తివాచనను మొదలగుమంగళాచరణమును జేసినవాఁడును, ఔషధములయందు నమ్మికగలవాఁడును, స్నానాదులచే పరిశుద్ధుఁడును, ఉపవాసముజేసినవాఁడు నగుమనుజుఁడు మంచిముహూర్తమునందు పైచెప్పిన గుణములతోఁ గూడినదియు పాలుగలదియు పచ్చిదిగనుండునదియునైన యోషధిని గ్రహించవలయును. పచ్చిదిగనుండు ఓషధులు దొరకనియెడల గ్రహించి 1 సంవత్సరమునకు పైఁబడకయుండు నోషధులను గ్రహించుకొనవలయును. బెల్లము - నెయ్యి - తేనె - ధనియాలు-ధాన్యములు - పిప్పళ్లు - వాయువిడంగములు ఇవి 1 సంవత్సరమునకుపైఁబడినవిగనుండినను గ్రహించవచ్చును.

క్షీరాదిగ్రహణక్రమము.

శ్లో॥ పయో బాష్కయిణాం గ్రాహ్యం విణ్మూత్రం త చ్చ నీరుజమ్ ।
వయోబలవతాం ధాతుపిచ్ఛశృంగఖురాదికమ్ ॥ 7.

తా॥ ఆఱుసెలల దూడగలదియు, రోగములేనిదియునైన ఆవుయొక్క పాలు - మూత్రము - పేడ వీనిని ఔషధమునకై గ్రహించవలయును. యౌవనము వయస్సు బలము వీనితోఁగూడియుండు జంతువులయొక్క రక్తాదిధాతువులు పిత్తము కొమ్ములు గిట్టలు మొదలగువానిని ఔషధమునకై గ్రహించుకొనవలయును.

## స్వరసాదిపంచవిధకషాయములు.

శ్లో॥ కషాయయోనయః పంచ రసా లవణవర్జితాః ।
రసః కల్క శ్శృత శ్శీతః ఫాంట శ్చేతి ప్రకల్పనా ॥ 8.
పంచధైవ కషాయాణాం పూర్వం పూర్వం బలాధికాః ।

తా॥ లవణముతప్ప మధురాది 5 రసములుగలద్రవ్యములు కషాయముల కాధారముగనుండును. స్వరసము కల్కము శృతము శీతము ఫాంటను అని కషాయములు 5 విధములు. వీనిలో ఫాంటమనునది మిక్కిలివీర్యముగలది; దానికంటె శీతకషాయము, శీతకషాయమునకంటె శృతకషాయము, శృతకషాయమునకంటె కల్కము, కల్కమునకంటె స్వరసము ఇటుల యొకదానికంటెనొకటి అధికవీర్యముగలదిగనుండును,

"కల్పనావశతః పంచానాం రసానాం కషాయసంజ్ఞావ్యవహారః । తస్మాద్గుణగుణినో రభేదోపచారా దిహ రసగ్రహణేన తదాశ్రయాణాం ద్రవ్యాణాం గ్రహణం మంతవ్యమ్ ॥"

అని పైఅర్థమునే చరకాచార్యుఁడుగూడఁజెప్పియున్నాఁడు.

## స్వరసలక్షణము.

శ్లో॥ సద్య స్సముద్ధృతా త్క్షుణ్ణా ద్య స్స్రవే త్పటపీడితాత్ ॥ 9.
స్వరస స్స సముద్దిష్టః

తా॥ శ్రేష్ఠమైనభూమిలోనుండినపుడే గ్రహించఁబడినయోషధులనుచక్కఁగ మర్దించి వస్త్రఖండములోనుంచి పిండిన దానియందుండి స్రవించునట్టిరసము స్వరసమనఁబడును.

"ఆహతా త్తత్క్షణాకృష్టా ద్ద్రవ్యా త్క్షుణ్ణాత్సముద్భవేత్ ।వస్త్రనిష్పీడితో య స్స్యా త్స్వరసో రస ఉచ్యతే । కుడవం చూర్ణితం ద్రవ్యంక్షిప్తం చ ద్విగుణేజలే.అహోరాత్రం స్థితం తస్మాద్భవేద్వారస ఉత్తమః। ఆదాయశుష్కం ద్రవ్యం వా స్వరసానా మసంభవే।జలేఽష్టగుణితే సాధ్యం [illegible] గృహ్యతే।స్వరసస్య గురుత్వా చ్చ పల మర్ధం ప్రయోజ

యేత్।నిశోష్షితం చాగ్నిసిద్ధం పలమాత్రం రసం పిబేత్ । మధుశ్వేతా గుడక్షారా౯ జీరకంలవణంతథా । ఘృతం తైలం చ చూర్ణాదీ౯ కోల మాత్రా౯ రసే క్షిపేత్ ॥"

ఓషధులనుగ్రహించి తోడనేనలియగొట్టి వస్త్రములోనుంచి పిండిన వది స్వరసము, రసము, అనిచెప్పఁబడును. 1 కుడవము ఓషధిని గ్రహించి చూర్ణముచేసి 2 కుడవము లుదకములోవైచి 1 యహోరాత్రము నానబెట్టి వడియగట్టిన యదియు రసమనియే చెప్పఁబడును. పచ్చిదిగనుండునోషధిదొరకనియెడల ఎండినయోషధిని గ్రహించి 8 రింతలుదకములోవైచి నాలవభాగము మిగులునటులకాఁచిననదియు రసముతోతుల్యముగ నుండును. పైస్వరసము గురుత్వముగలది యగుటంజేసి దీనిని $\frac{1}{2}$ పలము నిప్పించవల యును. దీనియందు తేనె - బెల్లము - క్షారములు - జీలకఱ్ఱ - లవణము - నెయ్యి - నువ్వులనూనె - చూర్ణము ఇవి చేర్చవలసియుండినయెడల కోలప్రమాణముచేర్చకొన వలయునని తంత్రాంతరమునందు చెప్పఁబడియున్నది.

## కల్కలక్షణము.

శ్లో॥ కల్కః పిష్టో ద్రవాప్లుతః ।
చూర్ణోఽప్లుతః

తా॥ పైచెప్పినప్రకార మోషధులను గ్రహించి చక్కఁగనూరి ఉదకాదిద్రవ ద్రవ్యములలోకలిపిన నది కల్కమనఁబడును. మఱియు నెండినద్రవ్యములను చూర్ణము చేసి యుదకములోకలిపిన నదియును కల్కమనియే చెప్పఁబడును.

"ద్రవ్యమార్ద్రం శిలాపిష్టం శుష్కం వా సజలం పిబేత్ । ప్రక్షేపావాపకల్కాస్తే తన్మాత్రా కర్షసమ్మితా । కల్కే మధు ఘృతంతైలం దేయం ద్విగుణమాత్రయా । సితాం గుడం సమం దద్యా ద్ద్రవాదేయా శ్చతుర్గుణాః ॥"

పచ్చిదిగనుండుద్రవ్యమును చక్కఁగనూరి ఉదకాది ద్రవ్యములలోకలిపిన నది కల్కమనఁబడును. దీనిని కర్షప్రమాణ మిప్పించవలయును. పైకల్కములో తేనె - నెయ్యి నువ్వులనూనె యివిచేర్చవలసియుండినపుడు రెండింతలధికముగను; పంచదార, బెల్లము చేర్చవలసియుండిన సమభాగములుగను; ద్రవద్రవ్యములు చేర్చవలసియుండిన 4 గింత లధికముగను చేర్చవలయునని తంత్రాంతరమునందు చెప్పఁబడియున్నది.

## శృతకషాయలక్షణము.

శ్లో॥ శృతః క్వాథః

తా॥ ద్రవ్యములనుదకములోవైచిచక్కఁగకాఁచినదికృతకషాయమనఁబడును.

"పానీయం షోడశగుణం క్షుణ్ణే ద్రవ్యపలే క్షిపేత్ । మృత్పాత్రే క్వాథయే ద్గ్రాహ్య మష్టమాంశావశేషితమ్ । తజ్జలం పాయయే ద్ధీమాన్ కోష్ణం మృద్వగ్నిసాధితమ్ । శృతః క్వాథః కషాయ శ్చనిర్యూహ స్స నిగద్యతే । క్వాథే క్షిపే త్సితా మంశై శ్చతుర్థాష్టమషోడశైః । పిత్తవాతకఫాంతికే విపరీతం మధుస్మృతమ్ । జీరకం గుగ్గులుం క్షారం లవణాని శిలాజతు । హింగు త్రికటుకం చైవ క్వాథే శాణమితం క్షిపేత్ । క్షీరం ఘృతం తైలమూత్రం చాన్యద్రవ్యం తథా క్షిపేత్ । కల్కచూర్ణాదికం క్వాథే నిక్షిపే త్కర్షసమ్మితమ్ ॥"

1 పలము ద్రవ్యములను నలియగొట్టి మట్టిపాత్రలోవైచి 16 పలము లుదకముపోసి 8 వ భాగము మిగులునటులకాఁచి సుఖోష్ణముగనిప్పించవలయును. ఇది శృతము, క్వాథము, కషాయము అనిచెప్పఁబడును. దీనిలో పంచదార చేర్చవలసియుండినయెడల పిత్తరోగమునందు 4 వ భాగమును, వాతరోగమునందు 8 వ భాగమును, కఫరోగమునందు 16 వ భాగమును చేర్చవలయును. తేనెచేర్చవలసియుండిన యెడల పిత్తరోగమున 16 వ భాగమును, వాతరోగమున 8 వభాగమును, కఫరోగమున 4 వ భాగమును చేర్చవలయును. జీలకఱ్ఱ - గుగ్గిలము - క్షారములు లవణములు - ఇంగువ - త్రికటుకములు - పాలు - నెయ్యి - నువ్వులనూనె - గోమూత్రము మొదలగు ద్రవ్యములను శాణ ప్రమాణముగను, కల్కచూర్ణాదులను కర్షప్రమాణముగను చేర్చుకొనవలయును. అని తంత్రాంతరమునందు చెప్పఁబడియున్నది.

## శీతకషాయలక్షణము.

శ్లో॥ శీతో రాత్రిం ద్రవే స్థితః ॥ 10.

తా॥ ద్రవ్యములను నలియగొట్టి శీతోదకాదిద్రవద్రవ్యములలోవైచి 1 రాత్రి నానబెట్టిన నది శీతకషాయమనఁబడును.

"క్షుణ్ణద్రవ్యపలం సమ్య క్షడ్భి ర్నీరపలైః స్మృతమ్ ।నిశోషితంహిమ స్స స్యా త్తథా శీతకసాయకః ॥"

1 పలము ద్రవ్యములనునలియగొట్టి 6 పలము లుదకములోవైచి 1 రాత్రినానబెట్టిన నది శీతకషాయమనఁబడును. అని తంత్రాంతరమునందు చెప్పఁబడియున్నది.

## ఫాంటలక్షణము.

శ్లో॥ సద్యోభిషుతపూత స్తు ఫాంటః

తా॥ ఔషధద్రవ్యముల నుష్ణోదకములో వైచి చక్కఁగఁ బిసికి అపుడే వడియ గట్టికొనిన నది ఫాంట మనఁబడును.

"క్షుణ్ణద్రవ్యపలే సమ్యగ్జల ముష్ణం వినిక్షిపేత్ । మృత్పాత్రే కుడవోన్మానం తత స్తు స్రావయే త్పటాత్ । స స్యా చ్చూర్ణద్రవః ఫాంటః తన్మానం ద్విపలోన్మితమ్ ॥"

1 పలము ద్రవ్యములనునలియఁగొట్టి మట్టిపాత్రలో వైచి 2 కుడవము లుష్ణోదకము బోసి వడియగట్టిన నది చూర్ణద్రవము ఫాంటము అనఁబడును. దీనిని 2 పలములిప్పించవలయును. అని తంత్రాంతరమునందు ఫాంటలక్షణము చెప్పఁబడియున్నది.

## స్వరసాదిద్రవ్యప్రమాణనిర్ణయము.

శ్లో॥ తన్మానకల్పనే ।
యుంజ్యా ద్వ్యాధ్యాదిబలత స్తథా చ వచనం మునేః ॥ 11.
మాత్రాయా న వ్యవస్థా స్తి వ్యాధిం కోష్ఠం బలం వయః ।
ఆలోచ్య దేశకాలౌ చ యోజ్యా తద్వ చ్చ కల్పనా ॥ 12.

తా॥ రోగియొక్క దోషధాతువయోబలాదులను ఓషధులయొక్క రసవీర్యాదులను చక్కఁగ పర్యాలోచించి వానికనుగుణముగ పైస్వరసాదిద్రవ్యప్రమాణముల నిశ్చయించుకొనవలయును. వ్యాధి, కోష్ఠము, బలము, వయస్సు, దేశము, కాలము వీనినిపర్యాలోచించి పైస్వరసాదికషాయమునందు అనుగుణముగా ద్రవ్యముల చేర్చుకొనవలయునని చరకాచార్యుఁడు "మాత్రాయా న వ్యవస్థాస్తి" అనుశ్లోకముచే చెప్పియున్నాఁడు.

## స్వరసమధ్యమప్రమాణము.

శ్లో॥ మధ్యం తు మానం నిర్దిష్టం స్వరసస్య చతుష్పలమ్ ।

తా॥ స్వరసమునకు 4 పలములు మధ్యమ ప్రమాణమని చెప్పఁబడియున్నది.

## కల్కద్రవ్యమధ్యమప్రమాణము.

శ్లో॥ పేష్యస్య కర్ష మాలోడ్యం తద్ద్రవస్య పలత్రయే ॥ 13.

తా॥ 1 కర్షము ద్రవ్యములను చక్కఁగనూరి 3 పలములయుదకము మొదలగు ద్రవద్రవ్యములలో కలపవలయును. ఇదియ కల్కమునకు మధ్యమ ప్రమాణము.

శృతకషాయమధ్యమప్రమాణము.

శ్లో॥ క్వాథం ద్రవ్యపలే కుర్యా త్ప్రస్థార్ధం పాదశేషితమ్ ।

తా॥ 1 పలము ద్రవ్యమును $\frac{1}{2}$ ప్రస్థముదకములోనైచి పాదావశేషముగ కాఁచవలయును. ఇదియ శృతకషాయమునకు మధ్యమ ప్రమాణము.

శీతకషాయద్రవ్య ప్రమాణము.

శ్లో॥ శీతం పలే పలై ష్షడ్భిః

తా॥ 1 పలము ద్రవ్యములను ఆఱుపలము లుదకము మొదలగు ద్రవ ద్రవ్యములలో కలిపి శీతకషాయమును సిద్ధము చేయవలయును.

ఫాంటకషాయద్రవ్యప్రమాణము.

శ్లో॥ చతుర్భి శ్చ తతోఽపరమ్ ॥ 14.

తా॥ 1 పలము ద్రవ్యమును 4 పలము లుదకము మొదలగు ద్రవ ద్రవ్యములలో కలిపి ఫాంటకషాయమును సిద్ధము చేయవలయును. స్వరసాది పంచవిధకషాయములకు మధ్యమ ప్రమాణము చెప్పఁబడినది. దీని ననుసరించి దేశకాలాద్యనుగుణముగ అధికముగఁగాని తక్కువగఁగాని ప్రమాణము నూహించుకొనవలయును.

తైలఘృతాదిపాకమున కల్కాదిపరిమాణము.

శ్లో॥ స్నేహపాకే త్వమానోక్తౌ చతుర్గుణవివర్ధితమ్ ।
కల్కస్నేహద్రవం యోజ్యం

తా॥ తైలఘృతాదిస్నేహములయొక్క పాకప్రకరణమునందు కల్కము స్నేహము ద్రవద్రవ్యము వీనికి ప్రమాణము చెప్పఁబడకయుండిన నచట కల్కమునకన్న నాలుగింతలు స్నేహమును, స్నేహమునకన్న నాలుగింతలు ఉదకాదిద్రవద్రవ్యములను చేర్చుకొనవలయును.

శౌనకమతకల్కాదిపరిమాణము.

శ్లో॥ అధీతే శౌనకః పునః ॥ 15.
స్నేహే సిద్ధ్యతి శుద్ధాంబునిః క్వాథస్వరసైః క్రమాత్ ।

కల్కస్య యోజయే దంశం చతుర్థం షష్ఠ మష్టకమ్ ॥ 16.
పృథక్స్నేహసమం దద్యా త్పంచప్రభృతి తు ద్రవమ్ ।

తా॥ తైలఘృతాదులను శుద్ధోదకములోఁగాని కషాయములోఁగాని స్వరసములోఁగాని కలిపి పాకముచేయునపుడు యథాక్రమముగ స్నేహమునకు 4-6-లేక 8 వ భాగము కల్కమును చేర్చుకొనవలయును. 4 ద్రవ్యముల కధికముగ కల్కద్రవ్యముల చేర్చునపుడు వానిని స్నేహమునకు సమముగ చేర్చుకొనవలయును. అని శౌనకాచార్యుఁడు చెప్పియున్నాఁడు.

## స్నేహపాక లక్షణము.

శ్లో॥ నాంగుళిగ్రాహితా కల్కే న స్నేహేఽగ్నౌ సశబ్దతా ॥ 17.
వర్ణాదిసంప చ్చ యదా తదైనం శీఘ్ర మాహరేత్ ।

తా॥ స్నేహమును పాకముచేయునపుడు కల్కముననుగ్రహించిన నది చేతికంటకుండుట, ఆ స్నేహమును నిప్పులోవేసిన చటచట శబ్దములేకుండుట, వర్ణము గంధము రసము స్పర్శము ఇవి చక్కఁగనుండుట, యీలక్షణములుకలిగినతోడనే దించుకొనవలయును.

## ఘృతాదిసమ్యక్పాకలక్షణము.

శ్లో॥ ఘృతస్య ఫేనోపశమ స్తైలస్య తు తదుద్భవః ॥ 18.
లేహస్య తంతుమత్తాప్సు మజ్జనం శరణం న చ ।

తా॥ ఘృతమును పాకముచేయునపుడు నురుగుశమించుట, తైలమును పాకముచేయునపుడు నురుగుకలుగుట, యివి సమ్యక్పాక లక్షణంబులు, లేహమును పాకముచేయునపుడు దానిని చేతితోనెత్తిన తీఁగవలెవచ్చుట, ఉదకములోవైచిన మునుఁగుట, శీర్ణముకాకుండుట, యివిమంచిపాకపులక్షణమని తెలిసికొనవలయును.

## స్నేహాదులకు త్రివిధపాకము.

శ్లో॥ పాక స్తు త్రివిధో మంద శ్చిక్కణః ఖరచిక్కణః ॥ 19.
మందః కల్కసమే కించిచ్చిక్కణో మదనోపమే ।
కించి త్సీదతి కృష్ణే చ వర్తమానే చ పశ్చిమః ॥ 20.
దగ్ధోఽతఊర్ధ్వం నిష్కార్య స్స్యా దామ స్త్వగ్నిసాదకృత్ ।
మృదు ర్నస్యే ఖరోఽభ్యంగే పానే వస్తౌ చ చిక్కణః ॥ 21.

తా॥ మందము చిక్కణము ఖరచిక్కణము అని స్నేహపాకము మూడువిధములు. ఘృతాదిస్నేహములను పాకముచేయునపుడు వానియందలి కల్కమును చేతితో నత్తిన నది చేతికి అంటకయుండిన మందపాకమనియు, చేతికంటికొనిన చిక్కణపాకమనియు, కొంచెమధికముగ పాకమునుజెంది కృష్ణవర్ణముగలదిగనుండిన ఖరచిక్కణమనియు తెలిసికొనవలయును. విశేషముగ పాకమునుజెందిన నది దగ్ధమనంబడును. ఇది వ్యాధినికుదుర్చదు. ప్రయోజనములేనిది. కొంచెముగ పాకముజెందిన స్నేహాదులు అగ్నిమాంద్యమును గలుగఁజేయును. మందపాకముగల స్నేహమును నస్యమునందును, ఖరచిక్కణపాకముగల స్నేహమును అభ్యంగమునందును, చిక్కణపాకముగల స్నేహమును పానము వస్తికర్మ వీనియందును ఉపయోగించవలయును.

## శాణాదిపరిమాణలక్షణము.

శ్లో॥ శాణం పాణితలం ముష్టిః కుడవం ప్రస్థమాఢకమ్ ।
ద్రోణం వహం చ క్రమశో విజానీయా చ్చతుర్గుణమ్ ॥ 22.

తా॥ శాణము పాణితలము ముష్టి కుడవము ప్రస్థము ఆఢకము ద్రోణము వహము అనునవి యథాక్రమముగ ఒకదానికంటె నొకటి నాలుగింతలధికముగనుండును. (అనఁగా 4 శాణములు 1 పాణితలము, 4 పాణితలములు 1 ముష్టి), ఇటుల కుడవాదిపరిమాణభేదములను తెలిసికొనవలయును.

## శుష్కార్ద్రద్రవ్యపరిమాణము.

శ్లో॥ ద్విగుణం యోజయే దార్ద్రం కుడవాది తథా ద్రవమ్ ।

తా॥ ఒకయోగమున నెండినద్రవ్యములు పచ్చివిగనుండుద్రవ్యములను సమభాగములుగ చేర్చవలసినదనిచెప్పియుండిన నచట ఎండిన ద్రవ్యమునకంటె రెండింతలు పచ్చివిగనుండు ద్రవ్యములను చేర్చవలయును. ఎండినద్రవ్యములు దొరకని యెడల పచ్చివిగనుండు ద్రవ్యములను రెండింతలుచేర్చవలయును. ఎండినద్రవ్యములు ద్రవద్రవ్యములు వీనిని సమభాగములుగ చేర్చవలసినస్థలమున ద్రవ ద్రవ్యములను ఎండినద్రవ్యములకన్న నాలుగింతలు చేర్చుకొనవలయును.

## అనుక్తద్రవప్రకరణమునం దుదకగ్రహణము.

శ్లో॥ పేషణాలోడనే వారి స్నేహపాకే చ నిర్ద్రవే॥ 23.

తా॥ ఘృతాదిస్నేహపాకద్రవ్యములనునూరుటకును - కలియబెట్టుటకును వీనికి ద్రవ ద్రవ్యముచెప్పకుండుస్థలములో ఉదకమును గ్రహించుకొనవలయును. స్నేహపాకమునందు ద్రవ ద్రవ్యముచెప్పకుండిన ఉదకమునే చేర్చుకొనవలయును.

## పరిమాణముచెప్పకుండుస్థలమున పరిమాణనిర్ణయము.

శ్లో॥ కల్పయే త్సదృశా న్భాగా న్ప్రమాణం యత్ర నోదితమ్ ।
కల్కీకుర్యా చ్చ భైషజ్య మనిరూపితకల్పనమ్ ॥ 24.

తా॥ ఏయోగమునందు ద్రవ్యమునకు పరిమాణము చెప్పఁబడకున్నదో యాస్థలమునందు సమభాగములుగ ద్రవ్యములను చేర్చుకొనవలయును. మఱియు నౌషధులకు కల్పము చెప్పఁబడకుండుస్థలములలో ఆద్రవ్యమును కల్కముచేసి చేర్చుకొనవలయును.

## కోలాదిపరిమాణనిర్ణయము.

శ్లో॥ ద్వౌ శాణౌ వటకః కోలం బదరం ద్రంక్షణ శ్చ తౌ ।
అక్షం పిచుః పాణితలం సువర్ణం కబలగ్రహః ॥ 25.
కర్షో బిడాలపదకం తిందుకః పాణిమానికా ।
శబ్దాన్యత్వే మభిన్నేఽర్థే శుక్తి రష్టమికా పిచూ ॥ 26.
పలం ప్రకుంచో బిల్వం చ ముష్టి రామ్రం చతుర్థికా ।
ద్వే పలే ప్రసృతి స్తౌ ద్వా వంజలి స్తౌతు మానికా ॥ 27.
ఆఢకం భాజనం కంసో ద్రోణః కుంభో ఘటోర్మణమ్ ।
తులా పలశతం తాని వింశతి ర్భార ఉచ్యతే ॥ 28.

తా॥ వటకము కోలము బదరము ద్రంక్షణము అనునవి రెండుశాణముల యెత్తునకు పేళ్లు. అక్షము, పిచువు, పాణితలము, సువర్ణము, కబళగ్రహము, కర్షము, బిడాలపదకము, తిందుకము, పాణిమానిక అనునవి 2 కోలములయెత్తునకుపేళ్లు, శుక్తి, అష్టమికా అనునవిరెండుకర్షములకుపేళ్లు. పలము, ప్రకుంచము, బిల్వము, ముష్టి, ఆమ్రము, చతుర్థికా, అనునవి 1 పలమునకు పేళ్ళు, రెండుపలముల ప్రమాణము ప్రసృతమనియు రెండుప్రసృతములు అంజలియనియు, రెండంజలులు మానికయనియు చెప్పఁబడును. ఆఢకము, భాజనము, కంసము, ద్రోణము, కుంభము, ఘటము, అర్మణము అనునవి 1 ఆఢకమునకు పేళ్ళు. 100 పలములు తులమనియు 20 తులములు 1 భారమనియు చెప్పఁబడును.

"షడ్వంశ్యో మరీచి స్తా షణ్మరీచ్యః సర్షప ఉచ్యతే । అష్టౌ సర్షపా స్తండులః తౌ ద్వౌ తండులా మేకో ధాన్యమాషః । తౌ ద్వౌ ధాన్య

మాషో యవః అతఃపరం చతుర్గుణవృద్ధ్యాంముాకా మాషక శాణ కర్షపల కుడవ ప్రస్థాఢక ద్రోణ వహాః కల్ప్యంతే ”

6 వంశీలొాకమరీచియనియు, 6 మరీచ లొాకసర్షపమనియు, 8 సర్షపము లొాకతండులమనియు, రెండుతండులములొాక ధాన్యమాషమనియు, రెండుధాన్యమాషములొాక యవమనియు, 4 యవములొాక అంబూాకమనియు 4 అంబూాకములు మాషకమనియు, 4 మాషము లొాకశాణమనియు, 4 శాణము లొాకకర్షమనియు, 4 కర్షములొాకపలమనియు, 4 పలము లొాకకుడవమనియు, 4 కుడవము లొాకప్రస్థమనియు, 4 ప్రస్థము లొాకఆఢకమనియు, 4 ఆఢకము లొాక ద్రోణమనియు, 4 ద్రోణములు వహామనియు, చెప్పఁబడును. అనిసంగ్రమునందు చెప్పఁబడియున్నది. మఱియునొకపలములో 10 వ భాగము ధరణమనఁబడును. మాషమునకు హైమమనియు, కర్షమునకుషోడశికమనియు, ఆఢకమునకు పాత్రమనియు, ద్రోణమునకు నల్బణమనియు పర్యాయనామంబులు. రెండుద్రోణములు శూర్పమనఁబడును. ఇటులతంత్రాంతమునందు చెప్పఁబడియున్నది.

## దేశభేదమువలన ద్రవ్యభేదము.

శ్లో॥ హిమవద్వింధ్యశైలాభ్యాం ప్రాయో వ్యాప్తా వసుంధరా ।
సౌమ్యం పథ్యం చ తత్రాద్య మాగ్నేయంవైంధ్యమౌషధమ్॥

తా॥ భూమి హిమాలయాపర్వతముచేతను వింధ్యపర్వతముచేతను విశేషముగ వ్యాపించియున్నయది. హిమవత్పర్వతములోజనించిన యౌషధము స్వభావముగనే సౌమ్యముగను పథ్యముగను నుండును. వింధ్యపర్వతము నందలి యోషధులు ఆగ్నేయముగ (అనఁగా నుష్ణవీర్యముగలదిగ) నుండును. శరీరమునకు పథ్యకరముకానేరవు.

షష్ఠాధ్యాయము ముగిసెను.

---

ఇతి శ్రీవైద్యపతి సింహగుప్తసూను వాగ్భట్ట
విరచితాయాం అష్టాంగహృదయ సంహితాయాం
ఆంధ్రతాత్పర్య సహితాయాం
పంచమం కల్పస్థానం
సంపూర్ణమ్.

---

శ్రీ రస్తు.

# వైద్యగ్రంథములు.

| | రూ. | అ. |
|---|---|---|
| వైద్యచింతామణి 2 సంపుటములు | 8 | 0 |
| బసవరాజీయము | 7 | 0 |
| అష్టాంగహృదయము-బాహటము | | |
| సూత్రస్థానము | 6 | 0 |
| ,, చికిత్సాస్థానము | 4 | 8 |
| ,, కల్పస్థానము | 0 | 12 |
| ,, ఉత్తరస్థానము | 6 | 0 |
| అశ్వవైద్యశాస్త్రము | 2 | 8 |
| అనుపానమంజరి ప్రాచీనము గ్లేసు | 0 | 8 |
| అనుపానరత్నాకరము | 0 | 12 |
| ,, మేలుప్రతి | 1 | 0 |
| అనుపానతరంగిణి | 0 | 12 |
| ,, మేలుప్రతి | 1 | 0 |
| సద్వైద్యజీవనము, లోలంబ రాజీయము ప్రాచీనము | 0 | 8 |
| చికిత్సారత్నము | 1 | 4 |
| చికిత్సాసారము | 2 | 8 |
| సుశ్రుతము శారీరస్థానము ప్రాచీనము సవరణప్రతి కలికో గిల్టుపేరు వేసినది | 2 | 8 |
| శార్ఙ్గధరసంహిత ప్రాచీనము | 3 | 0 |
| వైద్యామృతము | 1 | 4 |
| సర్వౌషధి గుణకల్పము | 2 | 8 |
| వాజీకరణకల్పద్రుమము శరీర పుష్టి విధానము | 1 | 8 |
| వైద్యకాలజ్ఞానము ప్రాచీనము | 0 | 4 |
| ధన్వంతరి నిఘంటువు | 2 | 8 |
| వస్తుగుణపాఠము (గుణపాఠము) | 2 | 8 |
| ,, మేలుప్రతి | 8 | 0 |
| నాడీనక్షత్రమాల నాడీనిర్ణయము | 0 | 4 |

| | రూ. | అ. |
|---|---|---|
| నాడీజ్ఞానము | 0 | 3 |
| జీవరక్షామృతము వచనము | 2 | 0 |
| చెట్లవైద్యము సటీకా | 0 | 2 |
| వృక్షాయుర్వేదము | 0 | 4 |
| ధన్వంతరివైద్యచికిత్సాసారము | 0 | 12 |
| యూనానివైద్యామృతము | 0 | 12 |
| వైద్యపదనిఘంటు గుణభూషణము | 0 | 4 |
| వైద్యానుకూలకుటుంబ జీవరక్షిణి | 0 | 12 |
| వైద్యశతశ్లోకి తాత్పర్యము | 0 | 4 |
| ,, మేలుప్రతి | 0 | 6 |
| గురుశిష్యవైద్యచింతామణి | 1 | 12 |
| నాడీవిజ్ఞానము తాత్పర్యము | 0 | 4 |
| నాడీనిదానము తాత్పర్యము | 0 | 4 |
| మాధవనిదానము తాత్పర్యము | 2 | 8 |
| రసప్రదీపిక తాత్పర్యము | 0 | 12 |
| వైద్య ప్రస్తారము | 0 | 8 |
| వైద్య విధానము | 0 | 12 |
| జీవధనరక్షిణి | 1 | 0 |
| ఇలాజుల్ గుర్బా | 3 | 0 |
| షర్బత్తు పాకావళి | 0 | 6 |
| అనుభవవైద్యము 8 భాగములు | 4 | 0 |
| ,, 4 భాగములు | 2 | 0 |
| ఆరోగ్యదర్పణము | 0 | 6 |
| విషవైద్యచింతామణి | 2 | 0 |
| గదనిగ్రహము | 2 | 8 |
| కుమారతంత్రము | 0 | 6 |
| సర్పశాస్త్రము | 0 | 8 |
| అజీర్ణమంజరి | 0 | 4 |
| సహదేవపశువైద్యము | 0 | 8 |
| సహదేవపశువైద్యశాస్త్రము తా॥ | 0 | 6 |

| | రూ. | అ. |
|---|---|---|
| బృహద్వైద్యరత్నాకరము తా॥ | 2 | 8 |
| యూనానిదారుఢ్యవృద్ధిబోధిని 1 భాగము | 1 | 5 |
| ,, 2 భాగము | 2 | 5 |
| ,, 3 భాగము | 0 | 12 |
| స్రావకనివారణబోధిని | 0 | 13 |
| ప్లేగుచికిత్సాబోధిని | 0 | 14 |
| ప్రమేహనివారణబోధిని | 0 | 14 |
| వ్రణచికిత్స | 0 | 8 |
| నేత్రదర్పణము | 0 | 8 |
| దంతశోధిని | 0 | 6 |
| నాడిపరిజ్ఞానం తాత్పర్యము | 0 | 6 |
| ఘృతతరంగము | 1 | 0 |
| మానవధర్మచంద్రిక | 2 | 8 |
| స్వరశాస్త్రము స్వరచింతామణి | 1 | 4 |
| స్త్రీరత్నభాండాగారము (పాకశాస్త్రసహితము) | 2 | 8 |
| రాజమార్తాండము | 0 | 10 |
| షడ్రసనిఘంటువు, అభిధానరత్నమాల | 0 | 12 |
| వసిష్టప్రోక్తపులిప్పాణివైద్యము | 1 | 8 |
| అగస్త్యప్రోక్తము ,, | 1 | 8 |
| వ్యాసప్రోక్తము ,, | 1 | 8 |
| మర్మశాస్త్రమను సిద్ధమూలికారహస్యము మంత్ర యంత్ర నిఘంటు చికిత్సాసహితము | 1 | 0 |
| మలయాళ మంత్రరాజీయము 2 భాగములు | 1 | 12 |
| శార్ఙ్గధరకృతత్రిశతి | 0 | 8 |
| భేషజకల్పము | 0 | 8 |

| | రూ. | అ. |
|---|---|---|
| వాజీకరకల్పతరువు అను ధాతుపుష్టివిధానము | 0 | 8 |
| రసయోగరత్నాకరము | 0 | 12 |
| ధాతువృద్ధిబోధిని | 0 | 2 |
| ఇంగ్లీషు వైద్యసారసంగ్రహము | 0 | 2 |
| ఏకమూలికాప్రయోగరత్నావళి | 0 | 8 |
| ఆయుర్వేదస్వప్నప్రకాశిక | 0 | 4 |

## జ్యోతిష గ్రంథములు.

| | | |
|---|---|---|
| జలార్గళశాస్త్రము, తా॥ | 0 | 4 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరం | 0 | 8 |
| కాలామృతము, సటీక, మేలుప్రతి | 1 | 4 |
| బృహజ్జాతకము, టీ॥ తా॥ | 1 | 8 |
| ముహూర్తదర్పణము, సటీక | 0 | 14 |
| షోడశప్రశ్నరత్నావళి, తెనుగు | 0 | 6 |
| ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, | 0 | 6 |
| నక్షత్రచూడామణి, చక్రనిప్రతి | 0 | 6 |
| సంతానదీపిక | 0 | 8 |
| లఘుతాజకము, సాంధ్రతాత్పర్యం | 0 | 12 |
| వృద్ధపరాశరము ,, | 0 | 10 |
| కేరళప్రశ్నము ,, | 0 | 3 |
| సర్వార్థచింతామణి | 0 | 8 |
| ,, తాత్పర్యము | 3 | 0 |
| మయవాస్తువు, సాంధ్రతాత్పర్యం | 0 | 3 |
| వాస్తుసర్వస్వము ,, | 0 | 4 |
| శకునశాస్త్రము (శిఖినరసింహశతకము) తాత్పర్యసహితము | 0 | 4 |
| సారావళి, సాంధ్రతాత్పర్య | 3 | 0 |
| రెట్టమతము, తా॥ | 0 | 12 |
| లఘుజాతకము, తా॥ | 0 | 12 |
| స్త్రీజాతకము | 0 | 4 |

పిడుగు - వెంకటకృష్ణారావు పంతులు,

2/40, పెద్దినాయని వీధి, మద్రాసు.